# శశికళ

కులపతి అడివిబాపిరాజు

శ శి క ళా ని ల యం
బ్రాడీపేట
రామచంద్రపురం.
తూర్పుగోదావరి.

# శశికళ



( పాటల సంపుటి )



కులపతి

## అడివి బాపిరాజు



శశికళా ప్రచురణలు
[illegible]డిపేట
రామచంద్రపురం
తూర్పుగోదావరి.

# -: ప్రస్తావన :-

— ✽ —

శశికళాప్రియుడు, కవి, చిత్రకారుడు, సంగీత నాట్య కళాకోవిదుడు అగు కులపతి శ్రీ అడివి బాపిరాజుగారి శశికళ గేయకావ్యమును తొలిసారిగా ప్రచురించి ఆంధ్ర సారస్వతాభిమానులకు సమర్పించగలిగినందుకు ఎంతయో సంతసిస్తున్నాను.

ఇందలిగేయములు చాలావరకూ మద్రాస్, విజయవాడ, హైద్రాబాద్ రేడియో కేంద్రములనుండి ప్రసారితము లవుతూన్నవే. 'పాడకే నా రాణి' 'బాలవే నీవెపుడు' పాటలు రెండూ ప్రసిద్ధగాయకులు శ్రీ ఎమ్. ఎస్ రామారావుగారు హెచ్. ఎమ్. వి. గ్రామఫోన్ రికార్డులలో పాడియున్నారు. ఇందులో కొన్ని కొత్త గేయములుకూడా చేర్చి పుస్తకమంతా సరిచూసుకున్నారు తమజీవితపు చివరిదశలో బాపిరాజుగారు.

బాపిరాజుగారు రచించిన గేయములు, చిత్రములు అనేకం ఉన్నాయి. ఆయన ఒకచేతితో కలం మరొకచేతితో కుంచె పట్టుకుని సమంగా ఒకదానికొకటి అండగా రైలు పట్టాలవలె నడిపించారు.

ఆయన రచనాపద్ధతిలో ఎప్పుడూ నవ్యత్వంగో చరిస్తుంది. ఆయన గేయాల్లోని లలితమైనపదాలు భావరాగ తాళాలను సమపాళ్లలో ధ్వనిస్తాయి.

బాపిరాజుగారు స్వప్నసీమలలో విహరించి అపురూప సౌందర్యాలను సందర్శించి ఒక తేజోమూర్తిని తన ప్రేయసిగా, ధ్యేయమూర్తిగా చేసుకుని ఆరాధించారు. ఆ తేజోరాశియే శశికళ.

"నీకు ఇవతల
నాకు అవతల
తెరఉన్నాది శాలా!
తెరఉన్నదే!"

అంటూ ఒకసారి ఆమె నిజస్వరూపం చూడలేక పోతున్నానని తపనచెందుతారు.

లోకము అనుగేయంలో—

చంద్రలోకానికి తూర్పుగా సూర్యలోకానికి పశ్చిమం గానూ ఉన్న ఒక చిన్నిలోకానికి కన్నరాణిగావుండే శశికళను ఆయన దర్శిస్తారు.

"మంటిమింటికి శ్రుతిగా నాతలపు!
నా ఆత్మమధ్యవు
అమృతమూర్తివి నువ్వే నువ్వేనే!"

అంటూ బాపిరాజుగారు శశికళను తన ఆత్మమధ్యమున ప్రతిష్ఠించుకొని ప్రేయసిగాచేసుకున్నారు.

రాగిణీమాలలో—

"వేసవిని పుట్టిల్లు వెడలిరానలసించు
వాహినీ సతికొరకు
వగలు పొగిలేకడలి
ధ్యానమగ్నా దీపకము
పాడెదను నీకున్నై పాటలను దేవీ
వాకలై తేనియలు ప్రవహించుదేవీ!"

అనిపాడి ఒడలుతెలియక మినుకుమినుకని కనుకుతీసే తారకల సౌందర్యాలనడుమ వాలియున్న ఒక సోయగమును 'ప్రేయసీ' అంటూ మేలుకొలుపుతారాయన.

యోగినిలో—

"పూల పూజించితే
సోలిపోవుదువనుచు
ఆలయపు మోసాల
పూలిడితి పూజిస్తి"

అనటంలో అనూహ్యమైన ఆమె సౌకుమార్యం వెల్లడి అవుతుంది.

త్రపగేయంలో—

"బాలవే నీవెపుడు
గోలవే బేలవే!"

అంటూ ఆమెకళ్లనుండి పెదిమెలపైకి ఒదిగే సిగ్గు దొంతరలను మాలగా మెడలోవేసుకుంటారు.

విప్రలంభ శృంగారావస్థ ననుభవిస్తూ

"కుంచియలు రంగులతో కొలువచేరితినిన్ను
శిల్పపీఠి వసింప చేరరావే దేవి!"

అని శశికళను పూజాపీఠంమీాదికి ఆహ్వానిస్తారు బాపిరాజుగారు.

ఇష్టదేవతలో—

"హితులందరికి వారి ఇష్టదేవులుకలరు
యెంకొక్క దేవతై యెలిసెనట ఒక్కరికి,
కిన్నరీబాలా ప్రసన్నాఽ విలాసితుడు
రసవాహినీ స్నాత రమ్యవాగ్మియొకండు,
ఊర్వశీదేవి ప్రేమోల్లాసి చెలియొకడు"

అంటూ తన్మయరసానందంలో తన ఇష్టదేవతా సంప్రార్థనచేస్తారు.

ఎండిమియాన్‌లో—

అందాల అజంతాలోయల్లో తారాడుతూ అక్కడి రమణీయ ప్రకృతిసౌందర్యంలోని ప్రతిఅణువునూ, గుహల్లోని శిల్పచిత్రాలలోని వర్ణరేఖా విన్యాసాల ప్రతిపరమాణువునూ పరిశీలించి వెదికి గాలించారు బాపిరాజుగారు తన శశికళకోసం.

మూడువేల ఏళ్లవెనకే ఎండిమియాన్ అనే గ్రీకు బాలుడు ఆ లోయలో శశికళను ఆరాధించినాడు. ఆ ఎండిమియానే ఈబాపిరాజుగారు. కొన్నివేల సంవత్సరాలు విప్రలంభమనుభవించి మరల ప్రేయసికొరకు అజంతాలో అన్వేషణప్రారంభించినారు. ఆప్రకృతిలో వెన్నెల పూలతేనెలో కలిసిపోయి ప్రసరించే వింతకాంతిలో తనశశికళను కనుగొన్నారు.

ఈగేయానికి ఆయనగురువు 'కూల్డ్రే' ఒక చక్కని చిత్రం లిఖయించి ఇంగ్లండునుండి బాపిరాజుగారికి పంపియున్నాడు.

కలలు అబద్ధమనీ, కళలు వ్యర్థమనీ, కళలు సాంఘిక రాజకీయార్థిక విషయాలనుమాత్రమే ప్రపంచానికి అందివ్వాలనీ నేడు అధివాస్తవికవాదుల అభిప్రాయం.

ప్రకృతి సౌందర్యం, కావ్యములు, కళలు ఈసృష్టికి రసస్వరూపములు 'అల్పభావము లెట్లు శిల్పవిషయములౌను' అని పేలవమైన కృత్రిమప్రకృతిని ఖండిస్తారు బాపిరాజుగారు.

సౌందర్య సందర్శనవల్ల ఆనందం ఉద్భవిస్తుంది. ఆనందమే శక్తి. అట్టిశక్తియే నరులకు రక్తి అంటారాయన

'మనచేలిమి' అనే గేయంలో,

"ఎవరు నేనీజగతి
ఎవరు నేనీప్రగతి"

అని బాపిరాజుగారు జీవితాంతమున ఆత్మపరిశోధన చేసుకున్నారు.

శశికళ అనేకరూపాల్లో- సూర్యసుతగా, యోగినిగా నర్తకిగా, గానసుందరిగా, దేశికగా, ప్రేయసిగా, ఆయనకు దర్శనమిస్తుంది.

బాపిరాజుగారి జీవితమంతా కళామయంచేసి చివరికి ఆయనను తనలో లీనంచేసుకున్నది శశికళ.

బాపిరాజుగారు అదృశ్యులైనా ఆయన గ్రంథావళి దీపావళివలె ఎప్పుడూ జ్వలిస్తూనేఉంటుంది.

శశికళా నిలయం
రామచంద్రపురం
1 జనవరి 1954

రావులపర్తి భద్రిరాజు.

# విషయ సూచిక

— ✿ —

— ✽ —

# అంకితము

— ✽ —

నా ఆశయమూర్తి
నా ఆత్మపూజా పీఠస్థ
శిల్ప కళా లక్ష్మి
శశికళ కే

— బాపిరాజు.

— ✽ —



ఏడాది బాపిరాజు.

(ఊహాచిత్రం)

చిత్రకారుడు:- అడివి బాపిరాజు.

శ్రీరస్తు
శ్రీ పరదేవతాయైనమః

# తెర

✿

ధవళమైనదీ తలపుదాటినది
దానికి మొదలూ చివరా లేనిది

నీకు ఇవతల
నాకు అవతల

తెర ఉన్నాది బాలా!
తెర ఉన్నదే!

తెర మాటునన నీడను జూస్తిని
తెర చాటున నీపాటలు వింటిని
తెర జొచ్చిన నీ కాంతిని జోగితి

తెరు వేమన్నా
తెలియలేకనే
కలిగి పోతినీ

తెర ఉన్నాది బాలా!
తెర ఉన్నదే!

కన్నులుకానని రూపంపిలిచీ
కౌగిలి కందనిభావం తలచీ
తెర వైపున నా చేతులుమోడ్చీ
అర మూతలునా తీరని కలలై

చీల్చిన చిరగని తెర ఇవతల నే
చేరగ రానీ నీ వవతలనే
తెర ఉన్నాది బాలా!
తెర ఉన్నదే!



# అమరత్వము

*

ఓ చెలీ
ఓ చెలీ

నీవు నా నిదురలో మూర్తించి
నీవు నా ఎదలోన వర్తించి
పూవులో తేనవై
తావిలో మత్తువై
పాటలో ఫణితివై
మాటలో తేటవై

అమృత బిందువు లోని
అమరత్వమైతివే
ఓ చెలీ !
ఓ చెలీ !

*

# నిరీక్షణ

✽

నీకై నే ఎదురుచూస్తి
నీకై నే వెదకినాను
కను తెరచిన కలలమధ్య !
కల లెరుగని గాఢ నిద్ర
నీకై నే ఎదురుచూస్తి
నీకై నే వెదకినాను

నను తెలిసే శిశు దినాల
నిను తెలిసే బాల్య లీల
యౌవన మధు మధురాలలో
భావాల భావస్థితిలో
నీకై నే ఎదురు చూస్తి
నీకై నే వెదకినాను

ఎవరవో నీ వెటు లుందువో
ఎవరవో నీ వెట నుందువో
భువిజవో దివిజాంగనవో
అవతరించినావో ఏమొ
నీకై నే ఎదురుచూస్తి
నీకై నే వెదకినాను

కిన్నెర తీగెల మీటితి
మిన్నుదరియు రాగంలో
వెన్నెలలో కరుగు గీతి
నిన్నుపాడి నిన్ను వెదుకు

నీకై నే ఎదురుచూస్తి
నీకై నే వెదకినాను

తపస్సైన నిరీక్షణలో
తలపులతో బొమ్మైర్తిని
నాతోనే లోకాలూ
నాతోనే కాలాలూ

నీకై నే ఎదురుచూస్తి
నీకై నే వెదకినాను
కనుతెరచిన కలల మధ్య
కల తెరుగని గాఢనిద్ర.

*

# అనర్హత

✽

వెదకలేనే రాణి నిన్నూ
వేదనా పూర్ణిమా బ్రతుకు లోనూ!
వెదకలేనే రాణి నిన్నూ!

వదలలేనే కలలు
నిదుర లేదే మనసు
చెదిరె హృదయము శాంతి
కుదురుకోననే క్లాంతి
వెదకలేనే రాణి నిన్నూ!

కదలించి బ్రతుకంత
విదిలించి బంధనలు
చదల కెగయుగ దేపి
పెసలుంటు రెక్కలేవి ?
వెదకలేనే రాణి నిన్నూ
వేదనా పూర్ణిమా బ్రతుకు లోనూ!

✽

# అనర్ఘము

✽

నిన్ను దరిసిన కాంతి
నిన్ను పొందిన కాంతి
వెన్నెలలు వెలిగెనే
విరిసె మల్లెలు కోటి

నీవు వెలిగే కాంతి
నిన్ను వీడే కాంతి
మిన్ను ఏరే బాల
స్వాన్నామృతమె లీల

నిను చుట్టి ఒక కాంతి
నీలోస ఒక కాంతి
ఉజ్వలమ్మై సిత
ప్రజ్వలమ్మై తప్త
కాంచనమ్మై వెలిగ

నీవు నెలరేకవట
నీవు వెన్నెల వటే
పరమ శోభవు నీవు
నిరతిశయ ప్రణయవే !

✽

# ఎవరవే!

✻

ఓ చెలీ నీ వెవరు
ఓ చెలీ నీ వెవరు

కలలోని పాపవా?
కతలోని బాలవా?

మధుర మందానిల, పరిమళమవో
మధుమాస శారదాత్మిక సుషమవో!
సుందరాప్సరసాంగనా కంఠ
తుందిలము మందార మాలవో!

ఓ చెలీ నీ వెవరు?
ఓ చెలీ నీ వెవరు?

కలలోని ముగ్ధవా?
కతలోని స్నిగ్ధవా?

వారాసిలో పొంగు కెరటాలవో
తీరాల లోతులో నీలాలవో

తుంగ వీచీ శిఖర
భంగ రేఖా రచిత
శుక్తి గర్భాంతరిత
ముక్తా ఫలాచ్ఛవో!

ఓ చెలీ నీవెవరు
ఓ చెలీ నీవెవరు!

కలలోని పొలతివా?
కతలోని మెలతవా?

ప్రత్యూష బాలాధరారుణిమవో
నిత్య నూతన భాను కిరణమ్మవో!

గాఢ రజనీ హృదీ
వ్యూఢ గంభీరస్థ
తమసులో నుదయించు
విమలభాః కణమవో?

ఓ చెలీ నీవెవరు!
ఓ చెలీ నీవెవరు?

కలలోని సుందరివో?
కతలోని చందిరవో?

కాదంబినీ వక్షు నట శంపవో
ప్రాదంబరేంద్ర కార్ముక వర్ణవో?

అరుణాంశు చుంబితా
నందరాజీవ హృదయ
కేసరపరాగ గాం
గేయ ప్రకాశవో!

ఓ చెలీ నీ వెవరు
ఓ చెలీ నీవెవరు?

కలలో నణీయవా?
కతలోని ప్రణయవా?

దివిజ గంగా తరంగ స్వరమవో
హిమజ యమునా గమన గానమ్మవో ||

గోదావరీ సప్త
కూలం కషానుగత
తాపస పవిత్రపద
తాళ స్వరూపవో!

ఓ చెలీ నీవెవరు
ఓ చెలీ నీవెవరు?

కలలోని భావవో?
కతలోని దేవివో?

గగన లలనా శిరో రత్నమ్మువో
కలశపాధోరాశి సారసనవో?

తాండవేశ్వర నాట్య
తాళ తకిట ద్ధిమిత
ఝుంతర ఝుణ క్వణిత్
స్వర్ణ మంజీరవో!

ఓ చెలీ నీవెవరు
ఓ చెలీ నీవెవరు

కలలోని మాయవో?
కతలోని ధ్యేయవో?



# ఈ నిశిని

✽

బ్రతుకంతా నిరీక్షణము
మతి అంతయు వీక్షణానై
ఈ నిశిలో గాటవుతము
నేను వేచియుంటి నొంట

ఈనిశి ఒక సుముహూర్తము
గానము ఈ నిశ్చలతయె
ఈ కుటీర ప్రాంగణమున
చీకటి చెలిగా నిలచితి

ఈ నిశిలో రొదలు లేవు
ఈ నిశిలో సొదలు రావు
వేచియుంటి ఎవరికొరకొ
కాచియుంటి ఏ ఘటనకొ

ఈ నిశిలో నడికి రేయి
ఎవరో నాతోట తొంచ్చి
పూమొగ్గల విరియచేసి
ముంగిలో అడుగులిడిరి
తూరుపు వంల నెలతోంచెను
తొంగ కన్నెలు వగలూరిరి.

✽

# ఎవరికోసం

ఎవరికోసం కంఠమున ప్ర
స్రవణమైనా గీత ముంబుకును

ఎవరికోసం గీతికా ఝరి
ప్రవాహించును నదులు నుడులై

ఎవరికోసం నదుల నుడులలో
అవతరించును మధుర తాళో
ర్మికా కోటుల్ !

ఎవరికోసం ?
ఎవరికోసం శ్రీ

# ఎవరివో ఆ కలస్వనాలు

✽

ఎవరివో ఆ కలస్వనములు
ఎవరిదో ఆ మధురగీతము !
భువన మోహనరాగ మొక్కటి
పొంగిపొరలెను ఆసలు మునిగెను

ఇటులచూచితి అటులచూచితి
ఎటుల కనినను ఎవరు లేరూ
తీపి బరువుల గీతి మాత్రము
ఓపలేని నన్ను ముంచెను

శిల్ప ప్రతిమై చేష్టలుడిగితి
కల్పములు వే కరిగినవి హృది
గానమది అతిలోకమై చదల
లానె పాల్కడలిలో అలలై

గాయనీ ఆ బాల ఎవరో
ఏ అనంతములోన దాగెనో
ఎవరివో ఆ కలస్వనములు
ఎవరిదో ఆ మధురగీతము !!

✽

# నువ్వటే

✿

నువ్వటే నువ్వటే
పువ్వు విరిసిన వయసు
నవ్వు లలమిన సొగసు
రువ్వినా ఎదపైన
చివ్వు నంతర్హితవే
నువ్వటే నువ్వటే!

నువ్వటే నువ్వటే
కవ్వించి నాకాంక్ష
త్రవ్వించి నా కలలు
ఉవ్విళ్లుగొన మనసు
దవ్వైతి వే ద్రోహి
నువ్వటే నువ్వటే!

నువ్వటే నువ్వటే
జవ్వనీ ప్రణయినీ
మువ్వంపు వగలాడి
అవ్వారు ముద్దియా
నవ్వుతూ నను వదిలి
రివ్వు రివ్వున మిన్ను
పవ్వళింపైతివే
నువ్వటే నువ్వటే!

# పు ష్వ లే

*

పువ్వులే నీసొగసు
వేలుపుల
బువ్వలే నీనవ్వు
ఈ వెలుగు లేమంట
ఏను తడబడుటలే!
ఎంట చూచినా వెలుగు
ఎదురుకొన్నది నన్ను
కలవళము పడుతూనె
కనులు మూసితి నేను
పువ్వులే నీసొగసు
వేలుపుల
బువ్వలే నీ నవ్వు
కనులు మూసితె నేమి
కాంతులాపుట ఎట్లా
నాలోన నాపైన
నానార్థముల కాంతి
పువ్వులే నీ సొగసు
వేలుపుల
బువ్వలే నీ నవ్వు. !

*

# ప్రత్యక్షము

ఒక రాగాలాపనలో
ఒక గీతా విష్కరణలో

ఎవరో ఒక దివ్యరూప
ఎవరో ఒక తళుకుచాన
కిరణం లా కరణం లా
సురచాపం వర్ణం లా

మెరసిందహో మిలమిల్లై
దరిసిందహో దరిసెనమై !

ఒక రేఖా విన్యాసము
ఒక వర్ణం ప్రసరింపులో

ఎవరో ఒక దివ్య భావ
ఎవరో లావణ్య మూర్తి
ఆమ్నాయ సునాదంలా
అతివేల రసాపగలా
ఆసేచన కాలేఖ్యము
అతి రేఖావతరణమ్ము

నిరతిశ యానందమ్మై
పరిమళాంగి ప్రవిమలాంగి
పారిభద్ర ప్రసూనాంగి
విరిసిం దహో విదురేఖై
కురిసిం దహో సురమధువై !

దివి తరించి భువి తరించి
అవతరించె నా ప్రణయిని
దిశామూర్తి శశి కళాఖ్య
నిశామూర్తి శశి కళాఖ్య
గోదావరి పాడిందీ
గోవత్సం ఆడిందీ
సాయంతన కల్యాణాల
చల్లెను పన్నీటి జాలు,
చల్లెను స్వర్ణాక్షతలను
చదల దేవి ఆశీస్సుల!

❋

# లోకము

✱

చంద్ర లోకం తూర్పుదెసలో
సూర్యలోకం పశ్చిమంలో
చిన్నిలోకం ఒకటి ఉన్నాదే!
ఓనా వెన్నెల చిన్నారి పడుచా!
ఆ లోకమే లే
కన్నెరాణివి నువ్వే నువ్వేనే!

వాడిపోవని పూల తోటలు
నీడ లెరుగని నిండు పున్నమ
పరిమళాలే పిన్నవాయువులూ
ఓనా వెన్నెల చిన్నారి పడుచా!
ఆ జగతి వెలిగే
వన్నెలాడివి నువ్వే నువ్వేనే!

నింగి నీలిమ కంటి బొమలూ
ముంగురులె మొయిల గములూ
తొంగలి రెప్పలె ఇరుల కారంచుల్
ఓనా వెన్నెల చిన్నారి పడుచా!

చెంగలించే చుక్కలై నీకన్నుల్
నా పూజాపీఠం
సింగారి వేల్పువు నువ్వే నువ్వేనే!

పొద్దు పొడుపూ తొగరు కెమ్మోవి
ముద్దు మోమే మొయిల తెరువూ
నిద్దపుకౌనూ మిన్నుటేరేనే!
ఓనా వెన్నెల చిన్నారి పడుచా!
విద్దెలన్నీ నీవే నీవేనే
నా హృదయ కమలం
సుద్దు లాడివి సొబగు లాడివి
నువ్వే నువ్వేనే!

కంటిలోనికి కలలు పొదిగీ
కంఠంలోనే తీపులు పిదిగీ
జంట చేస్తివి చేతికి కౌశల్యా
ఓనా వెన్నెలా చిన్నారి పడుచా!
మంటి మింటికి స్రుతిగా నాతలపూ!
నా ఆత్మ మధ్యవు
అమృతమూర్తివి నువ్వే నువ్వేనే!

✿

# సూర్యసుత



సూర్య సుతవే శశికళా
చంద్ర బాలవు శశికళా

కుసుమమాలల
కోమలాంగి
మిసిమి వన్నెల
మించు బాలా!

సూర్యసుత వీవే
శశికళ
సోమ సుత వీవే!

అమృత విలసిత
విమల గాత్రీ
కౌమరు ప్రాయపు
కొమ్మ ముద్దులగుమ్మ వీవే

సూర్య సుత వీవే
శశికళ
సోమ సుత వీవే!

నిత్య వికసిత
నృత్య మూర్తి
ముత్యముల డాల్
మోహమూర్తి

సూర్య సుత నీవే
శశికళ
సోమ సుత నీవే!

నీవటే నా
ప్రణయ నిధివీ
నీవటే నా
తపస్సిద్ధివి

సూర్య సుత నీవే
శశికళ
సోమ సుత నీవే!

✻

# అవతరణము

*

నీలి మిను పవళింపు
నిదురించు నీ సొంపు
తేలిపోతూ దిగెను
వేల లే వెలిగేను.

తొంగలించే వయసు
నింగినంతా ఒలసె
బంగారు మంచాన
పవళించె నీ సొగసు.

తెలికొండపై గంగ
తేలి వాలిన రీతి
తెలివినా తలపుగిరి
తేలివాలితి నాతి

నిత్య వికసిత దేహ
నృత్య విలసిత హాస !
నిదురించు నిను కోరి
పదము మొదలిడినాను.

జన్మ జన్మల రాణి
తన్మయుడనే జాణ
మేలుకొలుపులు నిన్ను
జాలిగా పిలిచె నటె.

అల నల్ల నాడించి
అరవిచ్చె నీ కనులు
దరిసినది నీ సొగసు
విరిసినది నా మనసు.

విరుచుకొను నీ మేను
వికసించు కల్పకము
ఆత్రమై ఆశతో
చిత్రమై దరినేను.

వాలు చూపుల చూచి
మేలుకొనె నీ వలపు
తొలిపొద్దు కిరణమై
చెంగలువ అరుణమై.

జాళువా పాన్పుదిగి
బాల వయ్యారమై
మ్రోల నిలిచితి వటే
మోకరిల్లితి నేను

ఎవ రెవరి హృదయాలు
ఏమి కాంతించెనో
ఎవ రెవరి భావాలు
ఏమి కాంక్షించెనో !

*

Telugu University
తెలుగు విశ్వవిద్యాలయము గ్రంథాలయము
LS 5 54
నమోదు సంఖ్య ... 24
తేది.......

# అ తి థి

*

రూపు రేఖల రుచి తళద్ధళ
చూపు సౌ బగుల సురభిళమ్ములు

జల జలా వచ్చావు బాలా
పల పలా తోచావు బాలా!

స్వచ్ఛ శోభాపూర్ణ మూర్తి వి
విచ్చు పాటల పుష్ప వదనవు

అలలు లా వచ్చావు బాలా
కలలు లా వచ్చావు బాలా!

ఘల్లు ఘల్లన కాలి మువ్వలు
ఝల్లుమన నా జన్మ మంతా

వెల్లువై వచ్చావు ప్రేయసీ!
వెన్నెలై వచ్చావు ప్రేయసీ!

*

# నువ్వు

*

పూవు లో మసృణములు
తావి లో ఘుసృణములు
ప్రోవు ప్రోవులు చేరి
నీవుగా మూర్తించె.

రాయంచ స్విన్నతలు
ప్రాలేయ స్వచ్ఛతలు
లీలార్ద్రమై కలసి
బాల నీవై వెలసె.

కోకిలల కువ కువలు
వాక పరువుల కివలు
నీ కంఠమున సొలసి
నీకు పలుకులు పొలసె.

ఆకాశ నీలాన
రాకా సుధాకరము
నీ కనులు వెలిగెనే
నా కమృతము కలిగె !

# చరిత్ర

మనుష్యుడను నేనటే
ప్రియ బాల
అమర సఖి వీవటే!
ఒక తారకా కాంతి
ఒక దివ్య లిప్తలో
చీకట్లు వెలిగిస్తు
చేరినది ఈ భువిని
తార కిరణము నేను
తారకవు నీ వటే!
శిల్ప నిష్ణాత గా
చిత్రకారుణ్ణిగా
జన్మ జన్మా లెన్నో
తన్మయ కళా పూజ
శిల్పి నేనే నటే!
శిల్పమవు నీ వటే!
ఆనాటి జంతాన
ఆంధ్రపురి కటకాన
ఆంధ్ర కవి స్వప్నాన
ఆంధ్ర నట కరణాన
ఆంధ్ర సంస్కృతి నేన
ఆంధ్రత్వ మీం వటే!

# నీ ల ము



నీలి కలువ పుటాలలో
తేలిపోవు నీలి మలుపు
నీల రత్న హృదయంలో
సోలిపోవు కాంతి సూక్తి,
నెమలి గళము వంపుల్లో
నృత్యమాడు నీలి నిగలు
నీలాకాశ రహశ్యము
కాళిందీ ఝరి నీరము

ముర్తించినవే కన్నులు
నర్తించెను కనుపాపలు
సూర్య సుతా శశి కళవే
ఆర్య సఖీ శశి కళవే!



# శ శి క ళ

❀

దివ్య భాసిత రూప శశికళ
నవ్య సుందరమూర్తి శశికళ
నిత్య యౌవన స్నిగ్ధ శశికళ
ప్రత్యయిత నా దేవి శశికళయే!

చిత్ర రూపము రంగు శశికళ
శిల్పకౌశల్యమ్ము శశికళ
చిత్రకారుని కుంచె శశికళ
శిల్పి చేతులు ఉలియె శశికళయే!

కావ్య నాయిక నాకు శశికళ
కావ్య రసమున స్థాయి శశికళ
కావ్య వ్యంగ్యము రీతి శశికళ
కావ్యమే నాగీతి శశికళయే!

వీణ తీగల మెట్లు శశికళ
గాన మాధుర్యాలు శశికళ
రాగములు తాళాలు శశికళ
వేగమగు కీర్తనము శశికళయే!

# నగ్న



వెన్నెల లో వెలుగుధార
వన్నెల తో స్నానమాడ

ధవళకాంత తరళ మూర్తి
భువన సకల మోహ మూర్తి
ప్రణయ దేవి నా శశికళ
మృణాలాంగి నా శశికళ
పూర్ణ నగ్నయై నిలిచెను
చూర్ణ కుంతలా లాడగ.

తను భంగిమ హిమ శృంగము
మినువాకలో తరంగము

వెన్నెలలో స్నానమాడ
జ్యోత్స్నకలల ప్రోవు ప్రోడ్త
స్వచ్ఛ దేహయై నిలిచెను
స్వప్న సుందరై పొలిచెను
మిరుమిట్లయె నా కన్నులు
ఉరవడించె నా కోర్కెలు.

సమ భంగాకృతి నిలిచెను
సుమ పరిమళములు విరిసెను

నగ్నబాల నా శశికళ
నగ లలంకరించని కల
తళ తళమని మెరిసె దేవి
తలిరుటాకు మృదువు ప్రోవు
అనుప మాన సౌందర్యము
నిరుప మాన లావణ్యము
ఉద్రిక్తము నా హృదయము
ఉద్గాఢము నా ప్రణయము.

పదములు పూవుల గుత్తులు
మధుపము నా తోడి చిత్తము

సుషమాధారము జంఘలు
తుషారార్ద్రిములు తలపులు
అమృత కలశమామె కుకటి
అమరపతి నామె ఎదుట
డమరుక మధ్యమ్ము నడుము
క్రమము తప్పి మది నృత్యము

పారిభద్ర సుమకుచములు
బాహ్లీక సుమ చూచుకములు

ధవళ కమల ముకుళ గళము
నవమాలిక ఉరము కరము
సౌగంధిక కుసుమ ముఖము
సైరేయక సుమనాసిక
ఇందీవర లోచనములు
మందారిక కపోలములు
శేఫాలీ కుటి కైశ్యము
శ్రీఫలము మాలతి కృతి
పాటలాంఘ్రి కోష్ఠ ముద్రలు
ప్రవిమల మాకంద్ర సింపెను
పటిమ శోభతాన మగుచు
దివ్యదేవి నా శశికళ
భవ్యమయ్యె నా జన్మము !



# ఆ వెనుక

✽

చీకటి వెనుకే రాకా జ్యోత్స్నలు
నీ కనురెప్పల నీలిమ వెనుకే

వికసిత నిర్మల విద్యుద్రోచుల
పకపక నవ్వుచు పాపలు వెలుగును

కాంతి గర్భమున కలవు వర్ణములు
కనుపాపలలో కాంతుల లోతులు

రంగు రంగులై రాగము లీనుచు
శృంగారించును చిత్రము లెన్నో

వర్ణ గభీరము పదముల లోనే
పూర్ణ రూపమై పొలుచును భావము

చిత్ర రీతులలొ చెన్ను మీరు నే
పత్ర రేఖ నీ ప్రణయము దేవీ !

✽

# పరమార్ధము

✽

“ ఓ శిల్పి! నీ విద్య ఉపదేశమొసగునది
పరమార్థ మేమం”చు ప్రశ్నించినావు

“ సుందరము రేఖలో సొంబగైన వర్ణాల
నారాణి మూర్తింప నావిద్య” లన్నాను.

“ ఓ కవీ! నీపాట ఒదుగు మెదుగులలోన
చెలువొందు భావమ్ము సెలవీయు” మన్నావు.

“ జ్వలిత గీతాతటి చ్చలిత కాంతులమధ్య
నారాణి రూపింప నా తపస్స”న్నాను.

“ ఓహో నృత్యోపాసి! నీ అంగహారాల
ఓహారిలు గోప్యమ్ము ఊహేంది” అన్నావు.

“ నృత్త నృత్యాలలో వృత్తిలో చారలో
దేవి నీకై ఆడి నీవాదు” నన్నాను.

✽

# ఉగాది

✽

ఈ ఉగాది ప్రేమ సఖీ!
నా ఊహల కందవేమి
కలలోనే వచ్చినావు
కలలోనే కరిగినావు
ఈ ఉగాది ప్రేమ సఖీ!
నా ఊహల కందవేమె?

ఒక కౌగిలి ఒదిగిస్తివి
కికురించితి ఒకముద్దును
పకపక మను నవ్వులతో
కకు బంతము కలసినావె
ఈ ఉగాది ప్రేమ సఖీ!
నా ఊహల కందవేమె!

గంధ మలది కానుక లిచ్చి
విందు లిడితి విడియ మిస్తి
సుందరాంగి చంద్రికలో
మందు పెట్టి మాయమైతె
ఈ ఉగాది ప్రేమ సఖీ
నా ఊహల కందవేమె!

✽

# ప్రస్థానము

✽

ప్రేమార్థినై వెడలినానూ
శిల్ప
కామార్థినై కదలినాను!

ప్రకృతి పధములు నడచి
భావ లోకము గడచి
బహుదేశములు విడిచి
పడినాను అడివిలో

ప్రేమార్థినై వెడలినానూ
శిల్ప
కామార్థినై కదలినాను!

వర్ణాలు తూలికలు
పర్ణాల పాలికలు
వస్తువులు చేబూని
ప్రస్థాన మైనాను.

ప్రేమార్థినై వెడలినానూ
శిల్ప
కామార్థినై కదలినానూ!

కంటకావృత సరణి గండశైలాలలో
ఉస్సురని తూలుతూ ఓహోయని పడిపోతి

ప్రేమార్థినై వెడలినానూ
శిల్ప
కామార్థినై కదలినానూ!

ఎన్నాళ్లు ఎన్నేళ్లు
తెన్ను తెలియని ఒళ్ళు
కదలికే లేనట్టి
కట్టెనై పడిఉంటి

ప్రేమార్థినై వెడలినానూ
శిల్ప
కామార్థినై కదలినానూ!

ఒకనాడు శుభవేళ
వికసించె చంద్రికలు
నాపైన వాలినవి
రూపొందె శశికళా

ప్రేమార్థినై వెడలినానూ
శిల్ప
కామార్థినై కదలినానూ!

మసృణ కోమల కరము
ఘుసృణ పరిమళ స్పర్శ
నాకు ప్రాణము నిచ్చె
నాకు మెలకువ వచ్చె

ప్రేమార్థినై వెడలినాను
శిల్ప
కామార్థినై కదలినాను!

కన్ను విప్పితి లేస్తి
కౌగిలిని ఒదిగిస్తి
నా లోన చైతన్య
నా శశికళ! అనన్య!

ప్రేమార్థినై వెడలినాను
శిల్ప
కామార్థినై కదలినాను!



# శ్రుతిలేని

✽

పాడకే నారాణి పాడకే పాట
పాట మాధుర్యాల ప్రాణాలు మరిగెనే.

రాగ మాలాపించి వాగులా ప్రవహించి
సుడిచుట్టు గీతాల సుడిగి పోనీయకే
పాడకే నారాణి పాడకే పాట
పాట మాధుర్యాల ప్రాణాలు మరిగెనే!

కల్హార ముకుళములు కదలినవి పెదవులూ
ప్రణయపద మంత్రాల బంధించె జీవనము!
పాడకే నారాణి పాడకే పాట
పాట మాధుర్యాల ప్రాణాలు మరిగెనే!

శ్రుతిలేని నా మదికి చతుర గీతాలేల
గతిరాని పాదాల కతుల నృత్యమ్మేటే!
పాడకే నారాణి పాడకే పాట
పాట మాధుర్యాల ప్రాణాలు మరిగెనే!

✽

# మార్పు

✿

కత్తి పట్టిన చేతిలో దేవి
ఇత్తువేసే సకల సౌరభ పుష్ప దామము!

ఉరుము లురిమే కంఠమున దేవీ
వినయ చేస్తువె మధుర మంద స్వరములే!

తీక్ష్ణ రోహిత పూర్ణ జన్మిని
తీర్తు వేమే దివ్య మంజుల వర్ణములనే!

✿

# ఒకరికొకరు

✽

నువ్వూ నేనూ కలసి
పువ్వులో తావిలా
తావిలో మధువులా !

నువ్వూ నేనూ కలసి
కోకిలా గొంతులా
గొంతులో పాటలా !

నువ్వూ నేనూ కలసి
వెన్నెలా వెలుగులా
వెలుగులో వాంఛలా !

నువ్వూ నేనూ కలసి
గగన నీలానిలా
నీలాన శాంతిలా !

✽

# ఆట పాటలు

✽

వాన చినుకుల ఆట
కోన వాగుల పాట

నీదు సొగసుల కులుకు
నీదు వలపుల పలుకు.

మెరుము తళుకుల ఆట
ఉరుము తబరువుల పాట

నీదు కలతల అలుక
నీదు విరసపు చెళుకు.

మలయూం నిలుని జాలు
ఎలదేటి రుతి చాలు

నీదు తియ్యాని ఆట
నీదు హోయను పాట.

✽

# ప్రణయ కోపన

*

ఏల కోపంవచ్చినదో నీ
మ్రోల నిలిచిన నన్ను చూడవు
బాలికా నావైపు తిరగవు
పంతగించితివో ?

నీకై మీటిన తీపి పాటలు
వేణు వూదిన గాన మంత్రము
జాణ! నీకై పలుకు లాడవు
ముగ్ధనాయికవా ?

పూల తావుల అలలు చూపులు
మాలతీ వల్లరుల నవ్వులు
నీల గగన విలాస లీలలు
దాచుకొన్నావా ?

కాళిదాస మనోజ్ఞ కవితా
కలశవార్నిధి వీచికలు నీ
కౌగిలింతలలోని వింతలు
నేడు చూపవుటే !

పచ్చ కర్పూరాన వెన్నెల
పసిడి సంజల సంపగులలో

పాటలీ కుసుమాన ఉషసులు
చుంబనము లేపీ !

మేల మాడవు గంధ మాలగవు
పూల జడతో నన్ను కట్టవు
వాలు చూపుల నివాళించవు
ప్రణయ కోపనవా !

నేను చేసిన తప్పు లేవో
నేన ఎరుగను
గాన పూజలో అపశ్రుతిలా
కలత బెడితినో
ఆన తప్పితి నేమొ మోహా
ద్రిక్త విరసమునన్
ప్రాణకాంతా! పాద పద్మము
మ్రోల వాలుదు

ప్రణయ లీలల
ప్రథమ తప్పిద
మెట్టిదైనను
ఎరికైన క్ష
మార్హమే కాదా ?

# రాగిణీ మాల

✽

పాడెదను నీకునై పాటలను దేవీ!
వాకలై తేనియలు ప్రవహించు దేవీ!

సుమశాల ప్రేమకై
తమి మీరి ముగ్ధుడై
భృంగ బాలుడు పలుకు
శృంగార కళ్యాణి

పాడెదను నీకునై పాటలను దేవీ!
వాకలై తేనియలు ప్రవహించు దేవీ!

మధుమాస పికరాజు
విధుర సంక్లేశియై
గళమెత్తి కో యన్న
కల రాగిణీ తోడి

పాడెదను నీకునై పాటలను దేవీ!
వాకలై తేనియలు ప్రవహించు దేవీ!

వేసవిని పుట్టిల్లు వెడలిరా నలసించు
వాహినీ సతి కొరకు
పగలు పొగిలే కడలి
ధ్యానమౌ దీపకము

పాడెదను నీకునై పాటలను దేవీ!
వాకలై తేనియలు ప్రవహించు దేవీ!

# మే లు కొ లు పు

✿

సృష్టి అంతా నిశ్చలమ్మాయె
తుష్టి తీరక నేను మాత్రము

కాలమంతా నిదురపోయెను
మేలుకొని నే నొకడ మాత్రము !

మినుకు మినుకను తారకలలో
కునుకులాడెను కటిక చీకటి

కన్ను మూసిన పూలప్రోవుల
తెన్ను తెలియని గంధ బాలిక !

ఇంతలో ఆ నిశ్చలతలో
ఇంతలో ఆ సుప్త జగతిని

నిదురలోనివి టీయటూర్పులు
చెదరి తేలుతు నన్ను చేరెను !

"ప్రేయసీ!" అని గద్గదికమై
పిలిచితినే వణకిపోతూ !

"ప్రేయసీ!" యని మారుమ్రోగవి
హాయసీ పథి దెసల దెసలన్ని !

గాఢ నిద్రను సోలినవి న
క్షత్ర బాలలు ఒడలు తెలియక
వాని సౌందర్యాల మధ్యను
వాలియున్నది ఒక్క సోయగమూ!

"ప్రేయసీ!" యను నాదు పిలుపును
"ప్రేయసీ!" యను మారుమ్రోతయు
మేలుకొలిపెను తార బాలల
మేలుకొలిపెను సర్వ సృష్టిని!

తారకా బాలికల నడుమను
కోరికల ప్రోవైన నిహ్నా
మేలుకొలిపెను పిలుపు పాటలు
జాలిగా ఆనంద భైరవిలో!

సృష్టి అంతా ఝల్లు మన్నది,
చేష్ట లందెను కాల బాలిక
ఘల్లు మన్నది లోకనాట్యము
ఫుల్లమై రస దివ్య పుష్పము
వెల్లువలు గంధములు నింపెన్.

*

# యోగిని

పదము సవ్వడి అయిన
చెదురు నీ యోగమని
హృదయ దేవళ మూర్తి
ఒదిగి వస్తిని నేను.

పూల పూజించితే
సోలి పోవుదు వనుచు
ఆలయపు మోసాల
పాలిడితి పూజిస్తి.

గొంతెత్తి పాడితే
శాంతి పొడి యగుననుచు
లోలోన గుసగుసల
ఆలపించితి పాట.

ఎంత కాలము తపసు
కాంత కోరిక ఏమి
ఎదుట నిలచిన నేను
ఏవరము లిచ్చేను.

# సంగీత మేలనే

*

సంగీత మేలనే
పొంగేటి లయలేల

సంతోషమే లేని జన్మకిక
సంగీత మేలనే!

గొంతెత్తి పాడితే
గొణుగు పోయెను స్వరము

పాట రానేరాదు
బరువెక్కెనే గుండె

సంగీత మేలనే?

ఆనంద రూపమై
అవతరించే గీతి

ఆర్తిలో వికృతమై
అపయానమై పోవు

సంగీత మేలనే?

కోకిలల కంఠాన
మూకత్వమే చాలు
సెలయేటి పతనాల
జలము లింకిన చాలు
సంగీత మేలనే ?

నీవు కనరాని నా
కీ విపంచది ఏల
ఈ వేణు వెందుకే
ఈ హంగు లెందుకే
సంగీత మేలనే ?

పొంగేటి లయలేల
సంతోషమే లేని జన్మకిక
సంగీత మేలనే ?



# నాట్యము

✽

నారాణి కళ్లలో నాట్యమొకటి మెరిసె
తారాపథాలలో తళుకు హంగులు మురిసె!

నారాణి కనుబొమలు నాట రాగము పాడె
కారుమబ్బుల దరులు పూరించె శృతిమోడి!

నారాణి కనురెప్ప లారజము వాయించె
నీరధి నీలాలు ఆరభటి మ్రోయించె!

నారాణి కనుపాపలే రాగ తాళగతి
చార సంచారిగా నలిపె లాస్యము నిరతి!

నారాణి కళ్లలో నాట్య నాయకుడేను
ధీర లలితుడను, స్వాధీన పతికవు నీవు!

✽

# అక్కసురాలు

✽

ఒక్కణ్ణై ఎక్కణ్ణో
సుక్కపోయి సోలి యుంటి

మక్కువ ఇంతైన లేని అక్కసురాలా!
టక్కులాడి వైపోతివె

చక్కని దానా!

నా పూజలు మోసమంట
నా ప్రార్థన వ్యర్థమంట

నన్నొక పెరవాని చేసి
అన్నకారి మాటలంటి వక్కసురాలా!
టక్కులాడి వైపోతివె చక్కనిదానా!

ఒక్కణ్ణై ఎక్కణ్ణో
సుక్కపోయి సోలి యుంటి!
మక్కువ ఇంతైన లేదె అక్కసురాలా!

కళ్లల్లో శీతలాలు
కంఠంలో కర్కశోక్తి

పెడమోమై తిరిగినావు
ఎడదలోన దయలుమరిగి అక్కసురాలా!
టక్కులాడి వైపోతివె చక్కనిదానా!

ఒక్కణ్ణై ఎక్కణ్ణో
నుక్కిపోయి సోలియుంటి!
మక్కువ యింకైనలేదె అక్కసురాలా!

ఒక్కణ్ణై ఎక్కణ్ణో
చిక్కినట్టి ఆశ మనసు

ఊళ్లంటక ఏళ్లంటక
ముళ్లదారి పడిపోతిని అక్కసురాలా!
టక్కులాడి వైపోతివె చక్కనిదానా!

ఒక్కణ్ణై ఎక్కణ్ణో
నుక్కిపోయి సోలియుంటి
మక్కువ ఇంకైనలేదా అక్కసురాలా!

ఒక్కణ్ణై ఎక్కణ్ణో
ఒదిగి ఉంటి ఉస్సురంటు

కలలు రాక నిదుర లేక
కళల సీమ చేరబోక
ఏలాగో ఏలాగో
కాలంతో ప్రవహిస్తిని హో అక్కసురాలా !
టక్కులాడి వైపోతివా చక్కనిదానా !

ఒక్కణ్ణై ఎక్కణ్ణో
సుక్కిపోయి సోలియుంటి
మక్కువ ఇంకైన లేదె అక్కసురాలా !



# త్రప

✽

బాలవే నీ వెపుడు
గోలవే బేలవే!

పరమ సౌందర్యాలు
పడతి నీ కన్నులే

కన్నులలో దాగెనే
కమ్మన్ని సిగ్గొటి

బాలవే నీవెపుడు గోలవే బేలవే!

ఉదయ సంధ్యల ఎరుపు
పెదిమెలలో తేనెలే!

తేనెలో ఒదిగింది
తీయ తీయని సిగ్గు!

బాలవే నీవెపుడు గోలవే బేలవే!

తంత్రి స్పందించుతూ
తల వాల్చి పాడుతూ

నను ముంచు నీపాట నవ్యమయ్యె సిగ్గు!
బాలవే నీవెపుడు గోలవే బేలవే!

నీలి కనురెప్పలో మేలమాడే సిగ్గు
అందాల నీపెదవి అలమిపోనే సిగ్గు

దివ్య గాంధర్వాన నవ్యమయ్యె సిగ్గు
సిగ్గులను మాలగాచేర్తువే నాగళము!

బాలవే నీవెపుడు బేలవే గోలవే!



# ఆశయ దేవి

✽

మనుజుని మనుగడ కని క్రుంగితివే
మిను చెలి శశికళ! ప్రణయపు దేవీ!

తనలో దాగిన రాక్షసత్వమును
మనుజు డెప్పుడూ చెరవిడదీయును
చీల్చి చెండునట మానవత్వమును
నిల్చును ఘోరపు నీడై దారుల
మనుజుని మనుగడ కని క్రుంగితివే!

ఆతని వెలుగై ఆతని ఛాయగ
అనుసరించునట ఆశయ దేవియు
మనుజుని లోనే మను దేవత్వము
ప్రణయ పవిత్రము పరవశ రూపము
మనుజుని మనుగడ కని క్రుంగితివే!

కాకుము పసరము కాకు పిశాచివి
లోక కంటకుడవై కూలకురా
ఊకొట్టుము ప్రణయోక్తుల నరుడా
సేకరించుమురు శిల్ప రసజ్ఞత

నీకై నేనే నిత్యసుందరిని
నీ ఆనందము నేనే యనునట
నియత దేశికై ప్రియము సెప్పునట
మనుజుని ఉన్నతి కని పొంగెదవే!

కవియే యైనా గాయకుడైనా
రవిలా రంగుల రాజే నయినా
రాజ్యము లేలే పూజ్యుడె అయినా
ఆజ్యము పోసే యాజ్ఞికుడైనా
మతకర్తైనా శ్రుతికర్తైనా
వితములు తెలిసిన విజ్ఞుండైనా

ఆశయ ప్రణయము ఆరాధించును
ఆమెయె ఆతని ఆలంబనమని
మనుజుని మనుగడ వినిపించితివే
మినుచెలి శశికళ! ప్రణయపు దేవీ!

నీవే ఆశవు నీవే ఆశయ
మీవే నా దివ్యావతరణమవు
నేను నరుడనట నీ వమర్త్యవే
నీలో నేనై నాలో నీవై
మనుజుని మనుగడ వినిపించితివే!
మినుచెలి శశికళ! ప్రణయిని! దేవీ!

❀

# పూజ

అందుకోవేమే శశికళా!
నా పూజ
సుందరివి నీవె కాదంటవే!

ప్రణయ పల్లెరమందు
పంట్ల కాంక్షల గములు
చూపు పూవుల సరులు
ఊపిరే ధూపాలు
అందుకోవేమి ఓ శశికళా
నా పూజ
సుందరివి నీవు కాదంటవే!

తనువె నీ ఆలయము
మనసె ఆసనమయ్యె
నామ మంత్రము జపము
నా గీతములె వినతి
అందుకోవేమి ఓ శశికళా
నా పూజ
సుందరివి నీవు కాదంటవే!

కలల నారతి నిచ్చి
కళ నివేదనమిస్తి
అందుకోవేమి ఓ శశికళా!
నా పూజ
సుందరివి నా దేవివే నీవు!

# కంటినవ్వు

*

లోచనాల హాస లీల
లోలాక్షీ ప్రియ బాలా!

కనుపాపలలో హేలలు
కనురెప్పల నీలాలూ

కనుకొలకుల కాంతి కళలు
కనుమూతల పైన కలలు

లోచనాల హాస లీల
లోలాక్షీ ప్రియ బాలా!

పక్ష్మకాండ పటము వెనుక
భరత నృత్య లాసికమై

అష్ట నాయికల భావము
లభినయించె కంటి నవ్వు

లోచనాల హాస లీల
లోలాక్షీ ప్రియ బాలా!

అంతప్రేమ కనుల వెలిగె
ఆరతిగా అందుకొంటి

వెలుగుల వెనకై నవ్వులు
తలపై వాలిన పువ్వులు

లోచనాల హాస లీల
లోలాక్షీ ప్రియ బాలా!

చక్ష్వాంచల స్రావితమై
వక్ష్వాంచలములు చిందెను

ఆనందపు భాష్పములో
ఆర్ద్ర కరిగి కన్నీరో

లోచనాల హాస లీల
లోలాక్షీ ప్రియ బాలా!

ఆకాశము నీల నిధులు
అబ్ధి నుదులు నీలపధులు

నీ కన్నుల నీలి నవ్వు
నీరు నింగి తెలిసేయునో

లోచనాల హాస లీల
లోలాక్షీ ప్రియ బాలా!

*

# అటు ఇటు

*

ఈపక్క ఓనవ్వు ఆపక్క ఓనవ్వు
నవ్వు సుమమాలలో నేనూ
నవ్వు పరిమళమూర్తి నువ్వూ!

ఈవైపునో చూపు ఆవైపునో చూపు
చూపు చూపుల నడుమ నేనూ
చూపులో సౌందర్య మీవూ!

ఈ సాయనో పాట ఆ సాయనో పాట
పాట ఫణతుల నడక నేనూ
పాటలో మధురత్వ మీవూ!

ఈదరిని నా ఎడద ఆదరిని నీ ఎడద
ఎడద ఎడదల కోర్కె నేనూ
ఎడద ఫడదల ప్రేమ నీవూ!

# ఇంద్రజాలిక

చూపులోనే ఇంద్రజాలము చూపుటేలా మాయలాడీ!
రూపమెరుగని మంత్రలోకము ప్రాపణమ్మయె ధూర్తురాలా!

నేల బరువులు దాటిపోతిని నీల గగనము తేలిపోతిని
కాలమావల గడచిపోతిని వేలలన్నీ మీరిపోతిని
మూలమే ఆ భాసితమ్మగు లీలలోనే చేరిపోతిని
చాలునే నీ ఇంద్రజాలము
చాలునిక నా అవధి మించిన
సాద్భుతానందమ్ము దేవీ!

నెమలి పింఛెము విప్పవేమే
నేలపైనా కాలు నిలుపుము
వాలనీయవె చూపులను
ఈ లోక సామాన్యాలపైనన్.

# విప్రలంభ

*

నను జూసి నవ్వేవు
కను మూసి పోయేవు
　　　　నా బాధ నాలోన
　　　　నా గాధ నాకేన
దేవి నాతో నీకు ఈ విప్రలంభమటె
నీ వియోగము నాకు భావాధికరణమటె.
జాతిబాధకు క్రుంగి జాతి ముక్తికి పొంగు
జాత్యభ్యుదయ శిల్ప కల్పనాశయ హృదిని.
ప్రజల బ్రతుకులలోన ప్రతిభ ప్రశ్నలు నేను
ప్రజల హృదయములలో భక్తభావము నేను.
దేశోన్నతీ యత్న దీక్షా విజృంభుడను
దేశ సౌందర్యరస దీప్త జీవిని నేను.
కుంచియలు రంగులతో కొలువచేరితి నిన్ను
శిల్ప పీఠి వసింప చేరరావే దేవి.
నను జూసి నవ్వేవు
కను మూసి పోయేవు
　　　　నా బాధ నాలోన
　　　　నా గాధ నాకేన!

*

## ఒఖ్ఖిణ్ణే

*

మరచి పోవబోకె బాల
మరచి పోవకే!
అరచి అరచి పిలువలేను
తరచి తరచి వెదకలేను
పరచి ఎగురు కాంక్షలలో
పడి చెదురును నా గుండెలు — మరచి పోవకే!
హోరుమనే వారి రాసి
మారుమోగెను నా పాటలు
విరిగిపడే తరగలలో
నురుగులలో పరుగులలో — మరచి పోవకే!
ఒఖ్ఖిణ్ణే! యిసుక బయలు
ఒఖ్ఖిణ్ణే! నీరు దెసలు
కదలి పోవు దూరాలూ
చెదరిపోవు మేఘాలూ — మరచి పోవకే!
అదుముకొన్న నీ తలపులు
చిదిమి రాల్చు హృదయ సుమము
ఏరలేను రేకలన్ని
ఏరలేను పుప్పొడినీ!
మరచి పోవకే బాల
మరచి పోవ బోవకే!

*

# సంప్రార్థన

✿

సకల శిల్ప సుందరాలు
సర్వ రసానందాలూ
వెలసిపోవు దేవళాన్ని
చెలీ నీకు నిర్మించితి

అధివసింపరావ నీవు
అవతరించ ఒప్పుకున్న
ముందు యుగపు రసికాత్ములు
ముందు యుగాల సహృదయులు
పాడుపడిన సౌందర్యము
పరికిస్తా నిట్టూర్తురు.

ఏదో ఒక విడ్డూరము
ఏదో ఒక ప్రణయభంగ
మావహిల్లె నిచటనంచు
అంజలితో కంట నీరు
అర్పింతురు నీకు నాకు.

✿

# నా రాణి

*

నారాణి నావాణి నా శశికళవు దేవీ!
నా భాణి నాప్రాణప్రియ రహశ్యము నీవు నీవే!

కనుమూసి కను తెరచి కనలేని కలగనుచు
వినువీధిలో కొత్త మనుగడలు మలిచాన
......నా రాణి

వెన్నెలను వన్నెలను మిన్ను కన్నె వెదికి
నిన్నె నాసొద నడుమ విన్నదే నే నెరుగ
......నా రాణి

విడబోని నాకోర్కె కడపలను ఎరుగదే
ఎడమోని నాకొలువు జడత నే తెలియదే
......నా రాణి

నీప్రేమ కనలేక ఈసీమ మనలేను
నన్నోముదువోగాక. నా భ్రాముతే నాకొ!
......నా రాణి

కలలు విరుగగ నీకు తలపు లందగరావు
తలపులే కళంపస వలపు వరమీయవే!
......నా రాణి

*

# గంగాధర

*

నీలి ఆకాశాలు కన్నులు
నీలి ఆకాశాల చుట్టిన
ఆశలే నీ కంటి కాటుక — ప్రేయసీ!

ఆ, దివ్యపథముల వెలుగు కాంతులె
అంబురుహ నేత్రాంచలములను
కూడుకొన్నది నిర్మలాంబువు
లతి పవిత్రము లుద్గతమ్ములు.

లోక బాధలు లోక దుఃఖము
చీకటై ప్రజ డాయు మూర్ఖత
శోక భావోద్దీపనములై — కలత నింపెన టే!

ఆర్తి పొంగెను
అలముకొనె కన్నీరు వాహిని
అలలుగా ఆవర్తములుగా
అవధులన్నీ ముంచివేసెను.

వ్యోమ కేశుడ జడల విప్పితి
శ్యామ కైశ్యము దెసల పర్వెను
దుఃఖ జాహ్నవి కౌగిలిస్తూ
తోయముల తనలోన ధరాతలకు
జూటమై శశి శోభితాలంకృతుల నెలనై
పాలితునో దేవీ!

# కళా పరిమళము

✽

నేను : నన్నే ప్రేమింతు ఓ రాణి
నన్నే పాలింతు ఓ దేవీ !

ఆమె : నిన్నెరా ప్రేమింతు
వెన్నెలల బాలరా

నేను : నీ అంద మెక్కడే
నా అంద మెక్కడే
దివ్యపథములనుండి దిగివచ్చు మూర్తి వే
భూమిపై తిరిగేటి పోటు మానిసినేను !

ఆమె : భూమి నందము సేయు పుణ్యమూర్తి వి నీవు
ఆకాశ యాత్రలో అంతు దొరకని నేను
నీహృదయ మందమురా
నీసొగసు నీవెరా !

నేను : అర్ధచంద్రుడు నుదురు అమృతరసమే పెదవి
ఆకాశగంగ నీ అంగ విన్యాసాలు
నీవు సొబగుల రాణివే దేవి
నేను కర్కశ మూర్తి నే చెలీ !

ఆమె : నీవదన మొసరా నీచూపు కాంతిరా
నీపెదవిలో పాట నృత్యాలు సలుపురా
అందమే నీదిరా
సుందరిని నేనురా !

నేను : నీమూర్తి పూజింప
ఈ మనుజు లెందరో
అందరిలో ఒకణ్ణి
ఆశ నాకేలనే !

ఆమె : బ్రతుకు సర్వస్వమ్ము
పరమునై వేద్యమా
నీపూజె పూజెరా
నీవు నేనేనురా
నీకు నేనై వెలసి
నాకు నీవై పొలసి
ఇరువురము బ్రతుకులో
కెరలింతు మందదాలు !

నేను }
ఆమె } ఇరువురము లోకాన
పరిమళింతుము కళల
ఇరువురము ప్రేమికుల
మిరువురము శిల్పులము.

✽

# నిత్య యౌవన

నాలోన నీవూ నిత్య యౌవనవూ
ఏనుమాత్రం దేవి ఏళ్ల జీర్ణింతునే ?
నాలోన నీవూ నిత్య యౌవనవూ !

పాపలలో పాపనై పాడెదను ఆడెదను
అందాల పడుచుతో గంధాలు ప్రసరింతు,
నాలోన నీవూ నిత్య యౌవనవూ !

పూలమాలలు తాల్చి మేలమాడుదు నిన్ను
కాలాన్ని కట్టేసి కాలకిందను రాతు
నాలోన నీవూ నిత్య యౌవనవూ !

శక్తి కృంగని బుద్ధి రక్తి పొంగిన వృద్ధి
నీపాట శ్రుతికలిపి నీతో నృత్యముచేతు

నాలోన నీవూ నిత్య యౌవనవూ
ఏనుమాత్రం దేవి ఏళ్ల జీర్ణింతునే !

# అనుగమము

✽

నువు పరుగిడితివి నువు ప్రవహిస్తివి
నిను వెనుదవిలితి వనసఖ నామనిలా!

పికీ బాలవై విశా వికలుగా
కుహుకుహు నిస్వన విహారగీతము
రసాల నిష్కుట ప్రసారి తాంతర
కషాయ జేమన కలరాగంలో
రెక్కలు చాచిన నీవెనకాలే
సాక్కుచు కోకోయని నే నగిరితి!

నీలం నీడల హేలాలీలలు
జాలవి చిత్ర వికల్పవు విభ్రమ

దృశ్యా దృశ్యవు హాదినివైతివి
వశ్యుడనై నిను నిత్యప్రియగా

వరియించగ నిన్ననుగమియించగ
వారిద నాయక వేగాత్ముడనే!
శూన్యా శూన్యాంతపథి తారా
కన్యవు రోహిణి వసదృశమూర్తి వ

నన్యవు చొచ్చుకుపోతివి గగనము
వుణ్యవతీ నే నిన్ననురించెదను

కలాప్రపూర్ణుడు రాకా చంద్రుడు
కళానిలయ ఆతారక చేరేరీతిని
ఉదయం సాయం సంధ్యలలో
పదవిన్యాసము నృత్య గతులలో

ఉషా రమణిలా తుషారార్ద్రవై
పుషితారుణ రాగ ప్రఫుల్లవు

నువు పయనించితే! నీవెనకాలే
దివమణి సూర్యుడనై నే వెన్నాడితినే!

నువు పరుగిడితివి నువు ప్రవహిస్తివి
సవసవ నీకో నాడెను దేవీ

పడతీ నినునే పరుగులపట్టితి
పకపక నవ్వుతు నను జేరితివే
బ్రతుకున ఒకరై నువ్వూ నేనూ

పవన హృదయమున పరిమళమౌతూ
పయనమైతిమే పరమ శోభకై.

*

# కారణము

✿

ఎవరు నేనీ జగతి
ఎవరు నేనీ ప్రగతి
అవధి మించిన కాంక్ష
అందుకొను నా స్వగతి.

జవమూను నా కలలు
జగమేని దరియునా
సొగలు పొగలై బ్రతుకు
సోలినది నీప్రేమోల.

ఆశయము వలదేని
ఆవ లేమున్నదో
ఆలయము కలదేని
ఆవలీవల నిజము.

బ్రతుకె ఒక యోగమై
వితములను మది కలువు
సతియె అవధికి రూపు
కారణము నీ వలపు.

గ్రంథాలయం
నమోదు సంఖ్య ... 684
తేది ...

# మార్గము

*

అడుగడుగునకీ ప్రపంచపు
చెడుగు హృదయము లెన్నొచుట్టీ
కడుపునకు ఇసుమంత దొరకని
బడుగు బ్రతుకుల తూలునడకలో
మధురమెక్కడ మంజులత లేవీ! —దేవీ!
మార్గమెక్కడ స్వర్గ మెక్కడనే!

ప్రేమ లెరుగని నీనుమెంచని
తామసులతో దట్టమీ మహి
కోటి రూకల గుణములెంచే
కూళలెందరొ ఏలునీ భువి
మధుర మెక్కడ మంజులత లేవీ! —దేవీ!
మార్గమెక్కడ స్వర్గ మెక్కడనే!

క్రోధవహ్నులు కుములు నాడులు
సాధకమ్ములు మృత్యు కీలలు
సాధు దేశము శాంతమేగతి
సత్యశీలాఽహింస లేపధి
మధురమక్కడ మంజులత లవియే! —దేవీ!
మార్గమదియే స్వర్గ మదియేనే!

*

# ఇష్ట దేవత

✻

హితులందరికి వారి ఇష్ట దేవులు కలరు — నా బ్రతుకు
శ్రుతికలిపి వలపించు సతి చతురవు దేవీ!

యెంకొక్క దేవతై యెలిసెనట ఒక్కరికి
యెనక జల్మమునుండి యెన్నెని జన్మాల
హితులందరికి వారి ఇష్ట దేవులు కలరు!

హ్యాయేశ్వరీ దివ్య పదపుష్ప పూజార్ధి
వకుళ మాలిక నైచి వరియించె సఖుడొకడు
హితులందరికి వారి ఇష్ట దేవులు కలరు!

కిన్నెరీబాలా ప్రసన్నానవిలాసితుడు
రసవాహినీ స్నాత రమ్యవాక్ష్మి యొకండు
హితులందరికి వారి ఇష్ట దేవులు కలరు!

మఘవమస్తక మకుట మాణిక్యమై వెలయు
ఊర్వశీదేవి ప్రేమోల్లాసి చెలియొకడు
హితులందరికి వారి ఇష్ట దేవులు కలరు!

మందార పుష్పార్ద్రి సుందరీ మృదుహాస
చంద్రికా శోభితులు జంటకవి హితులొకరు
హితులందరికి వారి ఇష్ట దేవులు కలరు
నా బ్రతుకు
శ్రుతికలిపి వలపించు సతివి చతురవు దేవీ!

# ధ్యేయము

❋

నా బ్రతుకొక పరిమళార్ద్ర
నందనోద్యాన వనము
నందనాన విహరించే సుందరివే ప్రేమరాణి!

నా ప్రజ్ఞే నీ లోకము
నవ నవోన్మేషణమ్ము
నవ్యతలో నిత్యోదయ కల్యాణాలవే నీవూ!

నీ ఒదిగిన నా స్వప్నము
నింగివరకు స్పందించును
నిద్రాస్వాప్నిక పులకిత నిరుపమరూపవె సఖియా!

నా ప్రణయమె నీ రూపము
నా ఆత్మే నీ ప్రాణము
నీకునాకు విడుటేది విరహావేదనేదు ;

మన ప్రణయమె మన ధ్యానమిది....
మన యోగమె మన ధ్యేయము
మనమే మన ధ్యాతలమై
మనుదుమే అనంతమందు.

❋

# పి లు పు లు

✻

"బాపిరాజా!" అన్న ఏపిలుపు నేవిన్న
ఊపుదును మూర్ఛమ్ము ఊకొట్టి మాటాడి.

"బాపిబావా!" యంద్రు పలుకరింతురు హితులు
పారిజాతసుమమ్ము పట్టుదును అంజలిలో.

"బాబు!" యని మానాన్న పరమప్రేమను పిలువ
ప్రత్యక్షమయ్యెడిది పాలసంద్రము నాకు.

"నాన్న" యని మాఅమ్మ నన్ను దివ్యమై పిలుచు
నాకు పులకలుకలిగి నాకమ్ము అంటుదును

"హా° శశికళా ప్రియ భావుకా" అనుభూతి
ఉజ్జ్వల రసానంద దివ్యానుభూతియే, ఓదేవి!

✻

# నర్తకి

*

భూలోకానికి పూర్వపువైపున
ఆకాశానకు ఆవలిదెసలో
మూర్తించినదొక నర్తన శాలా
స్ఫూర్తిత వర్ణాతీత ప్రభాసము.

సముచిత వేషా సుందర రూపవు
విమల విభూష విచిత్రవి యచ్చర
వై పారిభద్ర మందార కుసుమ
మాలా చర్చిత వేణీ భరవై
రంగస్థలాన అవనిక ముందర
శృంగారవతీ నిల్చినావటే!

అచ్చర పడతులు హంగై పొల్చిరి
ఆ తౌర్యమ్ములు నాల్గు వాద్యములు
తతానద్ధ సుషిర ఘనాలంకృతలై
చతురలు, తౌర్య త్రికమునకు కలలు
నృత్య నాయికా! నీకెలకులలో
నిల్చిరి వివిధాలంకృత నాట్యవేషులై!

సభానుమతిగొని నమస్సు లిడితివి
సమందహాసవు మృదంగ వందన
మాచరించితివి కాకలి కంఠము
నాలాపిస్తివి అస దృశ రాగము
పుష్పాంజలివై దేవసన్నుతిగ
పూర్వరంగమును ప్రారంభిస్తివి.

స్వరజతి నొక్కటి నృత్తవిలాసము
విరచిత మంజులగతీ విశేషము
తకతక ఝుంతర తళాంగుధత్త
త్తై ధత్తత్తై యని శబ్దములో
ముక్తాయించితి మృదంగ నాదము
రక్తికొలుపగా మెరుము తీగవై.

అతి లోకాలంకృత నాట్యమంది
రాంతర సభలో నే నొక్కడనే
నాయకుడను సభ్యులునై కెరలితి
నాకై నీనాట్యము నీ విద్యలు
సౌందర్యము గాంధర్వము సౌష్టవ
సౌహార్ద సుభగ సౌశీల్యాలును దేవీ.

శృంగార రసాంచిత విరహోత్కం
గాంగహార కరణార్ద్రిత గీతము
ఆ లోలిత రస పరిఫుల్లసార
భాప్లావిత పరమభావ చలితము
హావీభావ విలసత్కృతాభినయ
ప్లోదము నద్భుతనృత్య మొనర్చితినే !

అటుఖండిత విటువాసక సజ్జిక
వభిసారిక వాక్కసారి ప్రోషిత
భర్తృక వాక్కట కలహాంతరితవు
స్వాధీన పతికవు స్వీయవు ప్రౌఢ
వఖిల రసాధిదేవత వనన్యవు
వాచ్యాభినయ విశారదవతివా !



# వరప్రదానము



దివ్యభూములకెటకో తేల్చుకొనిపోతివే !
దీనజీవినినన్ను దివ్యుణ్ణిచేసితే !

దేహమే శల్యమై
దినదినము కృశించి

నీప్రదర్శనమీని నిముసమొక యుగముగా
త్రోవ తెలియని అంధజీవినై కుందితిని

దివ్యభూముల కెటకో తేల్చుకొని పోతివే !
దీనజీవిని నన్ను దివ్యుణ్ణిచేసితే !

నీకె గురువును నేను
శ్రీకమల పరిమళా

దేశికుడ ప్రియుడనై ఆశించి భాషించి
దీక్షలో శిల్పవిన్యాస పులకితుడనై

దేవి నీరాకకై తీవ్ర వేదనపడితి !

ఏ ముహూర్తపు బలిమొ
ఏ పూర్వ పుణ్యమో

అమృత వాహినిరీతి అవతరించితివీవు
ఆనందరూపవై అధివసిస్తివి ప్రోల
దివ్యభూముల కెటకొ తేల్చుకొని పోతివే!
దీనజీవిని నన్ను దివ్యుణ్ణిచేసి తే!

హృదయాన మోమునుంచి ఒదిగితిని ఒడిలోన
కదియించి కౌగిటను నుదిటిపై చుంబించి
"ఓప్రభూ నీవిద్య
నా ప్రణయ" మన్నావు
సౌరభావృత హాస
సంస్పర్శ ఓషధై
నూత్న శక్తినిపొంది నూత్న జీవమునంది
యత్న కార్యోన్ముఖుడనై నిలిచి తేరాణి!
దివ్యభూముల కెటకొ తేల్చుకొనిపోతివే!
దీనజీవిని నన్ను దివ్యుణ్ణిచేసి తే!

✽

# పూల బాలిక

✿

పూల వనమున కలిసినామూ
నారాణి నేనూ
పూల పరిమళములో మెలిసినామూ !
పూల......

పూలలో ఉదయించి
పూవులా తానిలిచి
పూలజల్లుల నన్ను
సోలించె నాదేవి !
పూల......

తనకొరకు నే వెదికి
జనపథములే తిరిగి
వనరు నా బ్రతుకులో
వనల లక్ష్మియై వచ్చె !
పూల......

తనవనము తానంట
తన పూలు తానంట

గన పూలగంధముల
నన తేనియలె తాను!
పూల......

నాసందిటను ఒదిగి
నన్ను వనమున త్రిప్పి
పూల పుష్పాదులలో
సోలు తన్నే చూపె
పూల......

ఏపూవు తాల్చినా
నా పొందిటను తానె
ఏగంధ మలదినా
ఏకమటనేఁ దాను

పూలవనమున కలసినామూ
నారాణి నేనూ
పూలపరిమళములో మెలిసినామూ!



# యుగ్మము

*

అతడు : నీవు నేనే సఖీ!

ఆమె : నీవు నేనే సఖా!

అతడు: } వర్తన మహానదీ పంకజోద్భవులమై
ఆమె : } పైకెగసి ఫుల్లమౌ పద్మయుగ్మము మనము

అతడు : నీవు నేనే సఖీ!

ఆమె : నీవు నేనే సఖా!

అతడు : } సకల ప్రజారణ్య సంజాతులము ప్రత్యూ
ఆమె : } షాకాశ గాయకులు భరతపక్షులము మనము -

అతడు : నీవు నేనే దేవి!

ఆమె : నీవు నేనే ప్రభూ!

అతడు : } ఈ మహానంత విశ్వైక పథగాములము
ఆమె : } స్వేచ్ఛాప్రకాశ తారాద్వయమ్మును మనము!

*

# ఎండిమియాన్



(1) కొండతిరిగీ కోనతిరిగీ
కోన మధ్యను కొండవాగును
బండరాళ్లను పతనముర్స్యే
పండువెన్నెల పరుగులెత్తే,

లోయ చేరానే!
ఓనా వెన్నెలా బాలా!
సోయగాల లోయ చేరానే!

(2) అడివి చెట్లూ నిడివి లతలూ
జడల రాలే కడిమి పూలూ
కడిమి పూవుల కథల వింటూ

నడక సాగితినే!
ఓ కడలివెన్నల ఒడలుదానా,
గండశిలపై విడిది చేశానే!

(3) గండశిలలను కొండవాగూ
నిండుగొంతుక నినదమిస్తూ

పదములాడుతు పరుగులెత్తేనే!
ఓ ఉదయకాలం పెదవిదానా,
నదిని చేరే శిలను దాసితినే!

(4) చెట్లమీదే చంద్రబింబం
చెట్లకొమ్మల చంద్రకిరణం
చెట్లపూవుల వెన్నెల విరుస్తే
ఓ చిత్రకంఠము పలుకుదానా,
పూలతేనెల వెన్నెల కలిసేనే!

(5) గండశిలపై మేనువాల్చితి
కొండవాగూ పాట పాడెను
వెండి వెలుగులు నన్ను ముంచెను
ఓ నిండు వెన్నెల నీటులాడీ
పండుకొనుచూ నిదుర కూరితినే!

(6) పరిమళాలూ దెసల నిండెను
పరుగులెత్తే వాగు పాడెను
వాగుపాటతో చిన్నిపులుగులు
మూగ గొంతుల శ్రుతులు కలిపినవే
ఓ తామరపూవూ మోముదానా
తోగుపాటలు జోలపాడినవే!

(7) మూడు వేలా ఏళ్ల వెనకే
ఈడువచ్చిన గ్రీకు బాలుడు
ఆడుకొనెనే గ్రీసుదేశానా
ఓ అడవిమల్లెల అందందానా
గ్రీకు బాలుడు ఎండీమియానంటా !

(8) ఎండీమియాను అందగాడూ
అందమునకే అందగాడూ
గంధములు తావిందులిడు అర
వింద ముఖమువాడు కందునిపోలే
సుందరుడు ఆ ఎండిమియానంటా
ఓ చెందమ్మా మోముదానా
ఎండీమియానూ గ్రీకుబాలకుడే !

(9) ఆలమందల తోలుకుంటూ
చేలదాపుల ఏటిబడ్డుల
తేనెపాటల పాడుకుంటూ
తాన తిరిగెన ఎండీమియానంటా
ఓ మీనుకన్నుల మించుబోడీ
కోనలోనే ఆవులకాసే గొల్లవాడే గ్రీకుబాలకుడూ!

(10) వెలిగిపోయే కలువ రాజూ
కలిమిలల్లిన కడలి రాజూ

బలము పొదిగిన పర్వత రాజేనే!
ఓ బాగడవుప్పూవుల ఊర్పుదానా!
ఆలకాసే ఎండిమియాను ఏటిలోనే,
పెద్ద రాయిని నిద్దుర జోగేనే!

(11) కొండపక్కా వాగులోనే
గండ శిలపై నిదురపోయే
ఎండిమియాన్ని నువ్వు చూశావే
ఓ నిండు వెలుగుల నిశల రాణీ
ఎండిమియాను సుందర రూపము
నీదు చూపుల తళుక్కుమన్నాదే!

(12) నిదురపోయే ఎండిమియానూ
కన్ను తెరచీ నిన్ను చూసెను
ఇరువురి చూపులు కలిసిపోయెను
ఇరువురి మనసూ లేకమయ్యెను
ఓ వలపుల వెన్నెల పడుచా
నింగినువ్వా నేలపై నే ఎండిమియానంటూ!

(13) నేలపై అత డందగాడూ
నింగిపై నీ వందకత్తెవు
ఇద్దరి అందాలేకమైతే
ఏడులోకా లందాల వెలుగునే

ఓ దివ్యసుందరీ వెన్నెల బాలా!
దివ్య సుందరుడతడు లోకంలో!

(14) నీవు వలచిన ఎండీమియానూ
నిన్ను వలచిన ఎండీమియానూ
నీవుతప్ప ఇతరం లేదా అందాలవానికి
నీవె బ్రతుకూ నీవే సర్వం
నీవే నీవేనే
ఓ నిండు వెలుగుల నింగి సుందరీ
నీవేహృదయం నీవేప్రాణాం నీవే నీవేనే!

(15) కన్నులందూ వెన్నెల వెలుగూ
వెన్నెలేసే ఆతని ఊర్పూ
వెన్నెల లేని చీకటి రోజుల
కన్నులువాడీ కజ్జుబారి తా
మూర్ఛ మునిగెనే
ఓ శీతలాత్మా చిత్ర దేవీ!
వెన్నవలె నీమనసూ కరిగిందే!

(16) ఆతని ప్రేమకు పొంగిపోతివి
ఆతని సొగసుకు అలరిపోతివి
ఆతని అందం, అందం నీదీ
అలలూ అలలా కలసిపోయితివే!

ఓ వెన్నెలా చిన్నారి పడుచా
మీా కలయిక దేవులు మెచ్చారే!

(17) జలజల పోయే వాగు మధ్యను
శిలాతల్పం పవ్వళించీ
కలలుకంటూ నిదుర పోతిని
నిదురపోయే నాపై వాలితివే!
ఓనా వెన్నె వన్నెల రాణీ
నిదురలో నన్ను కౌగిలి చేర్చితివే!

(18) నిదురపోయే నన్ను చూచీ
నాపై వాలిన నిన్ను చూచీ
గురువు "కూర్బే" చిత్రం లిఖయించె
ఓనా బ్రతుకు తెరువుల ప్రవిమలాంగీ
"ఎండిమియూనని" చిత్రం పేరుంచే!

(19) చిత్రం చూచిన పెద్దలంతా
చిత్రమెంతో గొప్పదనిరీ
చిత్రం వ్రాసిన చిత్రకారుడు
ఎండీమియాన్ని చూచేనన్నారే
ఓనా నిత్య ప్రణయినీ
చూచిన సత్యం నీకే తెలుసునే!



ఆ జం తా లో య లో బాపిరాజు.

చిత్రకారుడు:- ఆస్వాల్డ్ కూల్డ్రే

# మన చెలిమి



నా సఖీ మన చెలిమి
వేసటేనట భువికి

కాసంత ఉపకారి కాదంట మనుజునకు
నా సఖీ! నా సఖీ!

జీవిత విధానాలు
భావి కర్తవ్యాలు

ఎరుగ లేనే లేని
ఎదురుకోనే లేని
పాటలెందుకటంచు పదములేలా అంచు
పలుకుదురు భాషణాలు చిలుకుదురు దూషణాలు
నా సఖీ మన చెలిమి
వేసటేనట భువికి!

జుమ్మను మధుర శ్రుతి
తుమ్మెదలు ఆడవా!

కొమ్మ కొమ్మకు తేలి
కోకిలలు పాడవా!
అవి వట్టివమ్మంట అర్థరహితమ్మంట

నా సఖీ మన చెలిమి
వేసవేనట భువికి!
కాసంత ఉపకారి
కాదంట మనుజానకు!

పుష్పగంధ వ్యాప్తి
పూర్ణ చంద్రుని దీప్తి
భుక్తి నీయఁగ లేని శక్తి హీనములంట
ఓ సఖీ మన ప్రేమ
వేసవేనట భువికి!

కలలు ఫాలుకక్కయట
కళలు వ్యర్థములంట
కళలైన సాంఘిక రాజకీయార్థికా
చలిత భావోద్రిక్త సంకలితమ్మై యుండ
వలెనంట, మనుజప్రగతికి దారంట అవి!
ఓ సఖీ మన ప్రేమ
వేసవేనట భువికి!

భౌతికోన్నతి జేర్చు భౌతికోద్యములుండ
భౌతికోద్యమ మహాప్రజ్ఞార్థి సమదర్శ
నస్థితికి మానసానంద బుద్ధ్యానంద
స్వస్థతయె మూలమ్ము భావోజ్వలము లవియె

ఓ సఖీ మన ప్రేమ
వేసటేనట భువికి !

ప్రకృతిలో సౌందర్య ప్రత్యక్షదృశ్యాలు
వికసితోత్తమకృషులు సకలకావ్యములు కళలు

పరమసృష్ట్యా విర్భవ రసస్వరూపములు
నరజాతి ప్రగతికవి ఆలంబనోద్దీప
నాధారములు విమల హృదయస్థితికి కార
ణాత్మికము లాప్తశక్తి ప్రఫుల్లములు
ఓ సఖీ మన ప్రేమ
ఆసాధ్య మీ భువికి !

అమలమా ఏదృశ్య
మమృతమా ఏఘటన

కాల్పనిక చిత్రమై శిల్ప విషయము కాదొ !
అల్పభావము లెట్లు శిల్ప విషయములౌను
పొడితనము ఉన్నతలె
జడత సంపన్నతలె

ఓ సఖీ మన ప్రేమ
ఉత్తమోత్తమ చరిత్రకదవే !

భాతి కాకర్షణాతీత సంకలనమే
భామ్యమా తుచ్ఛేంద్రి యాకర్షణాతీత

రీతియో, ఘటనయో
ప్రీతియో, ప్రేమయో
సౌందర్య రూపమ్మొ సౌందర్య భావమ్మొ!

సౌందర్య సంధాన సందర్శనోద్భవము
ఆనందమో దేవి! ఆనందమే శక్తి
ఆనందమే ప్రగతికై నరులకిదు రక్తి

ఓ సఖీ మన ప్రేమ
అసాధ్య మీ భువికి
ఆనంద సౌందర్య
ప్రాణమే మనుజునకు!

*

# సొగసు … వయసు

✽

ఆసొగసె నీ సోయగమె దేవీ
ఆవయసు నీ హొయలుకావే!
చిట్టిపాపగ నేను చిందులాడిన వయసు
నట్టింట నలుగురూ నన్ను ముద్దిడుసొగసు
ఆసొగసె నీ సోయగమె దేవీ
ఆవయసు నీ హొయలెకావే!

పుట్టుతూ కేరుమని పొంగిపోయిన వయసు
తొట్టిలో శిశువునై తొక్కులాడిన సొగసు
ఆసొగసె ఆహొయలె దేవీ
నీ సోయగము వయసుకావే!

చిలకపందిరి చూస్తు కిలకిలను నావయసు
కులుకుతూ రంగుబొమ్మల నాడు నాసొగసు
ఆసొగసె ఆహొయలెదేవీ
నీ సోయగము వయసుకావే!

"బాపన్న బంగారు బాలన్న" ఆ వయసు
పాటలకు నిదురలో పవ్వళించిన సొగసు
ఆసొగసె ఆహోయలె దేవీ
నీ సోయగము వయసుకావే!

మెళ్లోన పులిగోరు కాళ్ల గజ్జల వయసు
ఒళ్లు బంగరుతోనల ఒరుసుకొను నాసొగసు
ఆసొగసె ఆహోయలె దేవీ
నీ సోయగము వయసుకావే!

తప్పటడుగుల కులికి తెలుపుదాటిన వయసు
కప్పురపు వాసనలు గంధమలదిన సొగసు
ఆసొగసె ఆహోయలె దేవీ!
నీ సోయగము వయసుకావే!

ఆనాడె నీకొరకు అన్వేషినగు వయసు
అందాల నెలపాప నడిగివేడిన సొగసు
ఆసొగసె ఆహోయలె దేవీ!
నీ సోయగము వయసుకావే!

❁

# వసంత పూర్ణిమ

*

ఒక దివ్యకుసుమ్ము వికసించినది నేడు
నాదగా నేడూ రేపు
నవ పరిమళాలలము.

ఒక దివ్యనాదమ్ము కకుబంతముల చరించు
కోటి వీణల శ్రుతులు
మీటుతూ పాడుతూ.

ఒక దివ్యవర్ణమ్ము సకల శూన్యాలలమె
గంభీర చిత్రాలు
గా రూపమెత్తుతూ.

ఈ ఫాల్గుణ పవిత్ర పరమ శోభాపూర్ణి
మా రాత్రి నాదేవి
మంగళాకృతి వచ్చె!

నాఎదుట నాదేవి నాశశికళే నిల్చె
ఎంకు నూతన శక్తి
నాకు నూతన శక్తి!

# స్మృతులు

ఏనాటివో స్మృతులు
ఈనాడు నాగతులు
ప్రాణాధికను దేవి
ప్రత్యక్షమిదు శ్రుతులు ......ఏనా
లిఖియించు చిత్రాన
లేమ! వర్ణాలలమి
రేకలను కూర్పుమను
సోకు లెట్టుల మరతు ......ఏనా
నా పాటలో తాను
నన తేనియల గొంతు
కలిసి పాడే తీరు
కలనైన మరతునా?......ఏనా
వెన్నెలే తానౌట
కన్ను మరిగిన తున్ను
వెడకలే నన్ను నను
ఒదిగించు టెరుగనా ......ఏనా
ఇది నా కమవాస్య
ఈ కటికి చీకట్ల
ఎంత బాధను మనుట
ఏనాటి స్మృతులనుట ......ఏనా.

# దే శి క



నాకు శిష్యవు దేవి నీవూ
ప్రణయ మూర్తి
నాకు దేశికవే! దేవి నీవూ!

కావ్యములు కవిత్వమున
కవియున రహశ్యాలు
కళని గూఢార్థాలు
తెలుపుమని వేడితివి

నాకు శిష్యవు దేవి నీవూ!
ప్రణయ మూర్తి!
నాకు దేశికవే! దేవి నీవూ!

భాషయన భావమన
వాగర్థ పరమగతి
వ్యంగ్యము అలంకారములు
అతి శబల వృత్తులన
రసమన రసానంద
రమ్య జీవిత పరమ

స్థితియన తెలుపుమని
చతురమతి కోరితివి
నాకు శిష్యవు దేవి నీవూ!
ప్రణయ మూర్తీ!
నాకు దేశికవే! దేవి నీవూ!

విమల గాంధర్వమే
కమనీయములు శ్రుతులు
సప్త స్వరోద్భవము
దీప్త మేళస్థితి
మూర్ఛనలు రాగాలు
ప్రస్తార గమకాలు
విస్తారిత స్థాయి
గాంధర్వ కావ్యాది
సౌందర్య రూపమని
దేవి నీరూపమే
భావాత్మమై వెలిగ
నాకు శిష్యవు దేవి నీవూ!
ప్రణయ మూర్తీ!
నాకు దేశికవే! దేవి నీవూ!

*

## ఇంతలో...

✽

పదివారములు కాదా దేవీ!
ఇంతలో
మది విరుగు విరసనా దేవీ!

హృదయాన కుమిలేటి
వ్యథ పోదు మాటలగు
కథగా మిగిలె ప్రేమ
కలలె ఇక నాకేమొ!
పది వారములు......

ఏనాటికీ కళలు
ఎన్నటికి నీ కలలు
సౌందర్య పూజ, ఆ
నంద హారతి నీకు
పది వారములు......

శిల్ప దేవికి నీకు
చిత్ర విద్యను పూజ

నినుకొలుచు నా బ్రతుకు
నిలుపుదువె ఈ సిలుగు
పది వారములు......

పాటకై నా హృదిని
పసిడి వల్లకి చేసి
మేళవించెడి తంత్రి
ఫెళ్లుమని తెంపుదువె!
పది వారములు......

ఆశాపరీమళము ఆరిపోవగ నీకు
ఆశాంతముల నలము
ఆశయా శోక సుమ
మే శమించు శోకమున
పదివారములు కాదో దేవీ!
ఇంతలో
మది విరుగు నిరసనా దేవీ!



# శ్రీవ గంగోత్తరి

✽

శ్రీవ గంగోత్తరీ
పావనోద్భూత మం
దాకినీ స్వచ్ఛ మ
స్తోక సౌందర్యమై!
నీ విమల గాంధర్వ
మావిర్భవించినది

ఆనంద పరవశుడ
అల భగీరథుడనై

నిలువెల్ల పొంగితిని దేవీ!
కలుషరహితము జగము దేవీ!

అమృతకలశము గళము
అమల మధుధారగా

నీగాన మాధుర్య
మాగమించెను

ముల్లోకములు గాన
కల్లోలములు నింద

అమృతాప్లావితతనూ
కమనీయ మూర్తినై
నిత్య విద్యా హృదయ
మృత్యుంజయుడ దేవి!

రాకేందు బింబాస్య
నీకంఠమే జ్యోత్స్న
కావుంజ మంజుల సు
రూపమై దివ్యమై
భవదీయ సంగీత
పరమ శోభాకాంతి
వేలలే ప్రసరించె
మూలాలు పులకించె
వసధ కలశాంబుధై
జనులెల్ల దేవులై

అబ్జ విగ్రహుడ శ
బ్ద బ్రహ్మనై నేను,
నిను పొదివికొంటినో దేవీ!
నీవు ప్రణవస్వరూపవే దేవీ!

*

# ఖేచరి

✽

ఖేచరీ గంధర్వ బాలా!
భూచరుడ నన్వేషి నేనూ
　　గరుద్ద్వయమును ముడిచి అస్మత్
　　గాన పూజాపీఠి వాసించుమా!

పల్లవాధరి! మధు వసన్తపు
పలవిని నీ వాలపింపగ
　　ఝల్లుమని నా మొరడుహృదయం
　　వల్లరీ సంఫుల్లమయ్యెన్.

గ్రామములు మూర్ఛనలు మొరసెను
గతుల బేధాలెన్నో మురిసెను
　　జతుల వర్ణాలన్ని నుడులై
　　మతుల పరవశతలను ముంచెన్.

స్థాయిత్రయములు అభినయమ్మొమె
కాలత్రికములు నృత్తమాడెను
　　తాలద్వా త్రిశన్మోహిని
　　తాండవించిందీ!

గళము వీడిన ఖరహరప్రియ
వెలుగు తరగలు విరుచుకొనిపడె
తళుకు తళుకని బ్రతుకు సర్వము
కళానిధి అయ్యెన్.

దేవి! నందనవన సుమాలను
నీవు మలచితి స్వర సుమాలిక
గ్రీవ భూషితదామ పరిమళ
భావపూరిత దేవమూర్తిగ
నేను నిలిచితినే!



# జ్యోత్స్నా ద్యుతి

*

ఇన్నినాళ్లు ఎటదాగెనో
క్రొన్నలరులప్రోవు పాట
విన్నది విన్నట్టు వెదికి
వీనులలసిపోయె దేవి! ...ఇన్నినాళ్లు
వన్నెల విలసిల్లు పాట
వెన్నెల సుడితిరుగు పాట
అన్నుకొను పరీమళాలు
అలది కలచు తేనెపాట ...ఇన్నినాళ్లు
ఇన్ని యుగము లెటనున్నదో
మిన్నులాను మేటి పాట
తెలి వెలుగులు మలచుపాట
కలరాగము లలముపాట ...ఇన్నినాళ్లు
కల్పాలే కరగివచ్చె
కడపలన్ని బ్రతుకుచొచ్చె
కల్పతరువు మేన వెలిసె
కలశాంబుధి మదినిపొలసె...ఇన్నినాళ్లు
నేడే నా హృదయవనిని
నిలిచె నిత్య మధుమాసము
నేడే నా జీవితపథి
నిలిచె నిత్య జ్యోత్స్నాద్యుతి.

# గానసుందరి

సారెలను సవరించి తంత్రుల
తీరుపుల మీటించి శ్రుతిగా
నేరుపులు పాటించి వయొలిన్
        తాల్చితివి హృదయాన దేవీ!

గారములు శృంగారములు మధు
పూరములు విరితోరములు ఝుం
కారములు ఘుంకారములు సం
రావములు నయ్యెన్.

రాగములు సంఫుల్లమయ్యెను
రాగమొందెను తానవర్ణము
త్యాగ బ్రహ్మమె నాదబ్రహ్మ
తీగెలను స్పందించి వెడలెన్.

జీవమున అట్టడుగు భావము
చేయిపెట్టి కలచినట్లై
చీకు తలపుల క్షుద్రకాంక్షలు
        చివ్వునా పైకెగసి వచ్చెన్.

గుండెలో ఎట్టన్ని రంగలు
మండిపోయెను ఆశయాశలు
ఎండిపోయెను మొండినై చెకు
        దుండగుడనైతిన్.

సత్తువంతా పోయి అందవు
మత్తులో పడిపోయి, హృదయము
ఎత్తు పల్లములోన వణికెను,
చిత్తమున నైరాశ్యమొదవెన్.

తీగెలను స్పందించు విల్లును
రాగ స్వరముల నాదు వేళ్లా
తూగిపోయే గీతికాతతి
దోగులాడెను దెసలు దెసలన్నీ!

కోయిలలు పాడేనొ వాగులు
లోయలో నృత్యాలు సలిపెనొ!
వేయి మలయానిలము లొకటై
వీచెనో శ్రుతులు శ్రుతులన్నీ!

కోటి పూవులు విరిసినట్లై
కోటి చంద్రిక లలమినట్లై
పాటలే ప్రసరించు బ్రతుకున
బ్రతుకు కదలక శిల్పమై నిలిచెన్.

ఏదియో అమృతాప్లావితమై
ఏదియో ఆనందలీలై
వేదనారహితంపు బ్రతుకై
రోదసీ పథమెల్ల నిండితి
హ్లాదమే విశ్వమై నిలిచెన్.

# గౌరీశంకర శృంగావిర్భవ



గౌరీశంకర శృంగా విర్భవ
గంగాధర మంజులతర హస్తా
    స్పందిత డమరుక దివ్య నినాదము
    సుందర వదనా నీ గాంధర్వము.

పంకేరుహ సంభవ సాధ్వీ రుచి
రాంక స్థిత వీణా ఖేలాన
ధృతపాణీ కంకణ నిక్వాణ
శ్రుతి సంశ్లేషిత గీతాసామ్యము
    అతి మోహనరూపా నీగానము.

యమునాతటి పాటలి తరు నీడను
సుమనోరజ సేవన మృదు వదనుడు
అతసీసుమ సంకాశతనుడు పరి
వృత సీమంతవతీ వ్రజబాలుని
మందార ముకుళ మధురాధర చుం
బచ్ఛుభ వేణూ వేణూస్వన పరమాద్భుత
మందెను నీ సంగీతము దేవీ !



# దీ పా వ ళి

❋

దీపావళీ! విశ్వ
రూపావళీ! నిత్య
జ్యోత్స్నావళీ! వృక్ష
శోభావళీ! దేవి
నా లక్ష్మి నా వాణి,
నా శక్తి నా ప్రతిభయే!
దీపావళీ... !

దీపావళీ! ప్రణయ
ధూపావళీ! రాగ
గంధావళీ! తోష
బంధావళీ! దేవి
నా బ్రతుకు నా చదువు
నా యత్న కార్యార్థమే!
దీపావళీ... !

దీపావళీ! వర్ణ
లేపావళీ! దివ్య
చిత్రావళీ! పరమ
శిల్పావళీ! దేవి

నా ప్రజ్ఞ నా దీక్ష
విన్యాస వైచిత్రియే !
దీపావళీ... !

దీపావళీ ! రాగ
వ్యాప్త్యావళీ ! గతుల
తాళావళీ ! కరణ
చారావళీ ! దేవి
నా నృత్య గీతాభి
నయ వ్యాప్తి వృత్త్యావళీ !
దీపావళీ... !

దీపావళీ ! రథ్య
దేవ్యావళీ ! మధ్య
శ్రుత్యావళీ ! మూర్త
స్మృత్యావళీ ! దేవి
నా ఆశ ఆశయము
నా అవధి ఆనందమే...!
దీపావళీ... !

అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ.
—*— ౨5 84